నెంచి నాదుమనోహరు * నెలమిఁ గూడి
క్రీడ సలుపుచు వేడ్కమైఁ * బోఁడిమిఁ గని
కాల మయ్యనేఁ జయ్యనఁ * గడపుచుందు
నన్నియును వమ్ము లయ్యెనే * యకట నేఁడు! 26
క. మన మెటియదె యట్టిప్రియుఁడు
చనెనే నిటు తనప్రియను వి * చారాంభోధిన్
మునుఁగన్ ద్రోయుచు ? నదయత
నను దిక్కఁడలినయబలగ * నలువ యొనర్చెన్ !
* తే. తరళకరకంకణాళి మం * ద్రరుతు లీనఁ,
గనకభూషణనికరముల్ * గాంతు లిడఁగ,
సరసలావణ్యపూరంబు * జాలుకొనఁగ,
శిశువుఁ బోలి యాడుదుఁ బతి * చెంత నలరి. 28
తే. ఇందు నానాథురుధిరంబుఁ * జిందఁజేసి
నట్టినాసహోదరులెల్ల * గిట్టువారు,
తుదకు నిరయంబుఁ గనువారు, * త్రుళ్లిపడెడు
బాష్పబిందువు లివి యానె * వమ్ము లనఘ! 29
వ. అయ్యా! వినుము, నా కైహికాముష్మికసుఖప్రదుండ
గునని నే నెవ్వని నమ్మితినో, యతనుసామ్రాజ్యవైభవ

సంధాతయవునని నే నెవ్వని భావించితినో, క్రూర
సోదరకృతనిర్బంధవిచ్ఛేదనవిధాయియౌనని నే నె
వ్వనిఁ దలంచితినో, యట్టి నానాథు, ననింద్యబలపరా
క్రమవిజితానేకయోధుఁ బొరివుచ్చి మచ్చిక పిచ్చిల
నెడంద నానందం బమందంబుగ నొంది క్రుందినక్రూ
రాత్ముల తెలుంగు నెఱుకపఱిచెద నాలింపుము. 30

తే. నామనోహరువంశము * నాకులమున
కంటెఁ దక్కువ యని యాడి * కరుణ లేక
నన్ను నలయించువారలు * నాదు భ్రాత
లెపుడుఁ గావున నొకనాఁడు * హితము నెలుఁగ.

తే. నేను బలికితి నీరీతి * నేమ మొప్ప
నన్నలార మమ్మిరువుర * నెన్నఁ ద్రెంప
రాని మోహబంధనముచేత * నా నలినజుఁ
డెలమిఁ గట్టియున్నాఁడు మీ * రేల యలుగ?

*సీ. శూరుఁడై సంతతో * దారుఁడై యభినవ
మారుఁడై వరసుకు * మారుఁ డగుచు,
శీలియై రిపువన * కీలియై సద్దయా
శాలియై దుర్జనో * న్మూలి యగుచు,

హారియై స్మరతాప * హారియై వందిత
శౌరియై సుపథసం * చారి యగుచు,
ధన్యుఁడై విబుధమూ * ర్ధన్యుఁడై సజ్జన
మాన్యుఁడై లలితవ * దాన్యుఁ డగుచు
వెలయుసీతనిఁ జేపట్టఁ * దలఁచు టకట
పోలదే నాకుఁ? గోపంబు * పొదల నేల
యిట్టికఠినంపుమాటల * నింక నాడ?
నితఁడె నాప్రాణపతియగు * నెఱుఁగుఁ డీరు. 33

తే. మీకులంబది గొప్పదై * మెఱయ నిండు
వేడ్క మీపేరు భువినెల్ల * వెలయనిండు
నిక్కి మీబాహుబలమది * నిగుడనిండు
నిక్క మితఁడె నామగఁ డగు * నీచుఁడైన. 34

క. హుతవహుఁ డతిశీతలుఁడై
సతతము వెలసిన రవియును * జరమాద్రిఁ దగన్
వితతంబుగ నుదయించినఁ
బతిఁ జేసికొనక విడుతునె * భయమున నితనిన్ ?

క. అని నేఁ బల్కిన వారును
గినుక న్ననుఁ గాంచి యోసి * కేరడమున మే

మనినారమటంచుఁ దలఁప
కు నిజము పల్కెదము వినవె * కోకిలవాణీ. 36

తే. నీచుఁ డైనట్టివానికి * మాచెలియలి
నిచ్చువారము గామని * యెలమిఁ బల్కి
వాని మరలించి పంపుము * చాన మంచి
కులమున జనించినట్టినిఁ * గోరికొనుము. 37

క. నావుడు నాపల్కుల నే
వావిరి వినలేక సుజన * వర్ణితచరితుః
ధీవరుఁ వరుఁ గని తెలిపితి
నావెతలను గాన నతఁడు * నర్మిలి ననియెః. 38

ఆ. ఇట్లు నీవు గుంద * నేల కలికిరో? యీ
వీడు వీడి యడవి * వేడ్కఁ జేరి
యందు నొక్కగుడిసె * నమరించుకొని నెమ్మి
నుంద; మిపుడ రమ్ము * మందగమన! 39

ఆ. నిశియుఁ దరిసె, జనులు * నిద్దుర మరఁగిన
వారు, గుఱ్ఱమొకటి * వచ్చియున్న,
దింత్రి రమ్ము వనికిఁ, * జింత లేలొకో నీరుఁ?
గాన వీరిభయము * గలదె మనకు? 40

తే. శీతకిరణుఁ డాకసమునఁ * జెలఁగు నదిగో,
తారకాగణ మదె పోలు * పాఱు బయుల,
ఘూకమునకుమాత్రమె కను * గూర్కు లేదు,
జాగుసేయక పోదము * చాన లెమ్ము. 41

క. అను నాప్రియుపల్కులకున్
మనమున నామోద మొంది * మారసురూపున్
వినుతామేయగుణాంచితుఁ
గనుఁగొని వేడుక యలరఁగఁ * గడఁకఁ బలికితిన్.

చ. వినుము భవద్వియోగమున
వేఁగఁగఁ జాల ముహూర్తకాలమై
నను, గరుణార్ద్రచిత్తమున
నాయక ప్రోవఁ దలంపవే; యిటుల్
గనుకని నన్ను నేఁచెదరు;
కాంత మదీయమనస్సరోజముల్
బనివడి రంజిలంగ నిఁకఁ
బల్కుము వచ్చెద నిప్డె కానరున్. 43

క. నినుఁగూడి యుండఁ గలిగిన
వనమైనను నాక మగును * వర్ణితచరితా;

నిను నెడఁబాసినతావది
వన మగు స్వర్గనిభ మైన * పట్టణ మైనన్. 44

క. అన్నలఁ దమ్ముల నెవ్వరి
నెన్నను; గరుణాసముద్ర * హేలాగతి నన్
మన్నన సేయఁగఁ దలఁపవె;
నిన్నే నమ్మెదఁ గరుణ వ * నిక్షిం గొనిపొమ్మా. 45

తే. కాంత వన్యము లైనట్టి * కలితఫలస
ముదయములనె నే సుధగాఁగ * మది గణింతు
నెపుడు నీప్రక్క శయనించు * నపుడు శాడ్వ
ల మిల మృదుతల్పముగనె యె * లమిఁ దలంతు.

వ. అనుడు నప్పురుషశార్దూలుం డుల్లాసతరంగితాంతరంగుండై పంచాస్యధ్యానజనితభయవికంపిత చిత్తంబగు ద్విరదోత్తమంబుకరణి నల్లకట్టెఁడులగు తోఁబుట్టుల నెట్టనం దలపోసి బిట్టులుకునన్నుఁ జేరఁ దిగిచి, బిగి కౌఁగిటం బొదివి జడు పుడిపి,యతి విమలహాసజ్యోత్స్నా లసన్ముఖేందుబింబంబు వాంచి నాదుమోముపయిం జేర్చి,.నామనోగతంబగు భయంబును బీల్చి వైవనో నా

నొక్క మక్కువ నించు మున్ను వెట్టి, హృదయాంత
స్థంబగు ననురాగరసంబు వెల్లివిరియునో నా నెసకమె
సఁగు నా యశ్రుపూరంబులఁ దనచేలాంచలంబునఁ దు
డిచి, నా దగు హృదయపరితాపంబుపరిమితి నెఱుంగం
దివిరెడునో యనఁగ శిరంబు మూర్కొని, మాఱుండను
నా రామపాలకుండు విత్తినవలపువిత్తనంబులు మొలక
లెత్తె ననంగ గగుర్పొడిచిన నా యొడలు నిమిరి తో
డ్కొని చని యొక్కింత దవ్వున నొక వృక్ష
మూలంబునకుం గట్టఁబడి పల్యాణాది సాధన సన్నద్ధం
బయియున్న యుత్తమాశ్వంబుపైఁ దానెక్కి నను
దనపురోభాగంబున నా రోహింపఁ జేసికొని గుఱ్ఱపుఁ
బగ్గంబుల నొకకేల నమర్చి, నన్నొకచేతఁ బట్టుకొని
యదలింపుడు నాహయం బతివేగంబుగఁ బఱవఁజాఁగె,
నట్లు. 47

తే. గగనతలమునఁ జంద్రుఁడు * గడు వెలుంగఁ,
దారకాగణములకాంతి * తళతళ యన,
నెడఁద నానందసందోహ * మెసఁక మెసఁగఁ,
దరలినారము కానన * స్థలినిఁ జేర. 48

సీ. చల్లనై యేతెంచి * సల్లలితామోద
ము వహించుగాడ్పుల * మురిప మమర,
జల్లనఁ గుసుమగు * చ్ఛముల నెల్లెడలను
రాల్చుభూజాతము * ల్రహిఁ జెలంగ,
ఈషద్వికసితమై * యింపారుకోరక
పఙ్క్తులు మణిదీప * పరిణతిఁ గనఁ,
దరళదీధితిపుంజ * ధరములౌ కిసలయం
బులు మణితోరణం * బులన మెఱయు,
నెఱయుహృదయంబునందును * నెమ్మిఁ బెంప
వలఁతియై క్రాలు కానన * స్థలినిఁ జేరి
యెడఁదనానందవారిధి * నెలమిఁ దేలు
చుంటి మలజక్కవలజంట * యుదుటు దోఁప. 49

వ. అట్లు. 50

ద్విపద.

పతిఁ గూడి యిలు వీడి * భయదమౌ కాన
నతివేగమునఁ జొచ్చి * యచ్చోట నొక్క
పర్ణకుటీరంబుఁ * బరఁగంగఁ గట్టి
నిర్ణయింపఁగరాని * నెమ్మితో నందు

వసియించి సంతోష * వారిధిఁ దేలి
మిసిమి దేఱెడుపండ్ల * మెసవుచు మధుర
కుసుమాసవంబులఁ * గ్రోలి నానాథు
నసమానరూపంబు * హాళిఁ గన్గొనుచు
నాతనితో వేఁట * కై యేగి కీర
పోతంబులనుబట్టి * పొలుపు దీపించు
నురువైనలతలచే * నొకపంజరంబు
నరుదారఁ బొనరించి * యందుఁ జిల్కలను
బెట్టి సంతసమార * వేడ్కమైఁదీపు
లుట్టిపడఁగ వాని * కొనరంగ మాట
లను నేర్పి వానిక * లస్వనంబు విని
గొనబాలునెమ్ముల * గోముఁ గన్గొనుచు
నానందపాథోధి * నలరంగఁ దేలి
కాననకుసుమవి * కాసముఁ గాంచి
వనదేవతావాస * పరిణతిఁ గాంచి
యనయంబు దీపించు * నబ్రంపుటీర
ములఁ జేరి ప్రియుఁ గూడి * మోదంబుఁ బొంది
చెలఁగి కూయుచు మూఁగు * చిలుతేంట్లయులివు

శ్రుతిగాఁ గలరుతంబు * సొంపారఁ బాడి
పతిని మెప్పించిన * వైఖరి పోయె
ననఁదనైతిని నన్ను * ననువాఱ నలువ
కనికరంబును వీడి * కారించి యిట్టు
లలయించుచున్నవాఁ * డయ్యయోపతిని
నలిఁ గూర్పకేమందు * నాదైనయెడరు. 51

చ. అరుదుగ నిల్లు వీడి వన
మందు వసింపఁగ నాథుఁ గూడి యీ
కరణిని వచ్చినట్టిననుఁ
గానఁగనేరకనాఁడుభ్రాత లా
పురమున నెల్లెడ న్వెదకి
పోకుఁడుచు నివ్వనిఁ జేరి మమ్ముఁ జె
చ్చెరఁ గని కోపవహ్నినెడ
సేయఁ గడంగక పల్కి రిట్టులన్. 52

ఉ ఎవ్వఁడ వీవు మాభగిని
నిట్టులు తోడ్కొని వచ్చినాఁడ వీ
క్రొవ్వెఁకఁ బాపువార మిది
గో కనుఁగొమ్మనిపల్కి వారలే

చివ్వకుఁ గాలుద్రవ్వఁగను
జేతులఁ బట్టెను వింటి నాథుఁడున్
నెవ్వగ చేసు వల్దనఁగ
నించిరి ముల్కుల నాదుసోదరుల్. 53

తే అంత నాప్రియుఁ డల్లనఁ * జెంత నున్న
నన్ను నటుత్రోసి తనవింటి * నారిఁ దిగిచి
నిశితబాణపరంపర * నిగుడఁ జేసి
నొంప నాదుతోఁబుట్టులు * నుడివి రిట్లు. 54

క. తులువా మాచెలియలి ని
ర్మలతరవంశోద్భవ నిటు * మ చ్చిడి వనికిన్
బలిమిం గొని తెచ్చితి వీ
ములుకులఁ దప్పించుకొనుము*ముచ్చిమి దగునే?

క. క్రొవ్వునఁ గన్నులు గానమి
నివ్విధమున మార్కొనెదవు * హేలాగతి ని
న్నివ్వనిఁ బొరివుచ్చెద మీ
జవ్వని నిఁక విడువవేని * సట లివి తగునే? 56

చ. కులముననో గుణమ్ములను
గొప్పనుతు ల్గనునట్టి స్త్రీనో

కలిమినో రూపసంపదనో
గాటఁపుబల్మినో నీదుగౌరవం?
బెలమిని గన్నుగాన కిటు
లీజవరాలిఁ గులీనఁ దెచ్చి యీ
నెలకువఁ జొచ్చి డాఁగితివి
నీదగుదిట్టతనం బదెట్టిదో. 57

వ. అనుడు నా ప్రియుం డెవ్వండుఁ గడుంగడు నిగుడుకినుక నడఁపఁజాలక బెడిదంపుటంపఱఁ దనభుజాదండగతకో దండంబున సంధించి చండతరక్రోధారుణనేత్రాంచలా విర్భూతవహ్నిస్ఫులింగరోచిర్జాలంబు లుల్కాలతెఱం గునెఱప, నతిక్షుధాప్రేరితవిపక్షవిక్షోభక్రియావిచక్షణ హర్యక్షకిశోరంబు మదాంధసింధురయూథంబుపయిం బోలె నాసోదరులపై నుఱికి సాయకవృష్టిఁ గురియింప వారుం గనలి యొక్కుమ్మడిఁ గవిసి యాబాణాసన గుణంబుఁద్రెంప నాతండు గటంబు లదరఁ గటకటంబడి పండ్లు పెటపెటం గొఱికి సింగంబుసటలటుల నిట లంబుపయిం బడుచికురపటలంబు నెట్టన వెనుద్రోసి యాకట్టెదురులగు నాతోఁబుట్టులఁ గట్టలుక నిట్టలం

పుటగ్గిఁ గురియించుచూడ్కులఁ జూచి నిట్టనిలిచి "మట్టుమీఱి యిట్టులు గాఱు లఱచు మీకుం దిట్ట తనంబుగలదేని నీపట్టినపాతంబు నెట్టైనఁ దప్పించుకొ నుఁ"డనుచుఁ దననడుమునఁ గట్టఁబడినపట్టియుం దిగిచి నెట్టికొని వారి యంపకట్టియల సరకుగొనక బిట్టలయిం పఁ బ్రళయకాలకాలుండునుంబోలెఁ బొంగి నాయగ్ర జుండు మండిపడి "యిదెచూడు మిచ్చండతరతరవారి నిన్నుం జెండాడి నీకండకావరంబును ఖండించు" నని యజ్జాండంబు బెండువడ నింపుకినుకం బలికి భండనం బునకు దొరంకొన నాఖండలుం డఖండభిదురపాణియై కొండలపయిం గవియుచందంబున నయ్యరవింద సుం దరవదనుండు నిజనిశితాసిదృఢముష్టిఁ గీలించి బిరబిరఁ ద్రిప్పి తద్భ్రమణాతివేగజనితాద్భుతనితాంతకాంతిచ్ఛ ట లనుపమక్రోధక్షుభ్యన్నయనారుణప్రభాజాలంబుల తోడం గూడి ప్రజ్వలింప నాత్మీయలంఘనాతిజవంబున నికటతరుస్థితనీడజంబు లదరి పఱవ నమ్మదాంధులగు నాయనుజన్ములపై నుఱుక, వా రార్చి పేర్చి యర్చిష్మం తు నెదుర్కొనుశలభంబులభంగి మార్కొన నా మ

నోనాథుండు తననిశితఖడ్గపాతంబున నొక్కనికత్తిం ద్రుంచియు, నొండొక్కనికేలుం ద్రుంచియు, మఱొక్కనికాయంబు గాయంబుసేసియుం గారింప వారంత వేలం గడచి యుప్పొంగుకడలివడువునం బోరింబోరిం దెఱపిలేక పొంగునలుకం బైమఱచి దరినున్న నన్నుం జూఱచుఱం జూచి రోంచి పాదతాడితభుజంగంబులకైవడి నుద్దామలీలలం దీవరించు గదాదండమండితంబులౌ నిజభుజాదండంబుల నాచాయం జూచి "యోసి చెడుగ! నీపుట్టుకచేతనె మావంగడంబు పెంపుడించియు నియ్యలంతివానిం గూడి యిటు వచ్చి యొక్కింతయుం జింతలేక యిక్కయ్యంబును దవ్వ నన నిలిచి యుల్లం బలరం జూచుచున్న దానవు; కనుం గొమ్మిదె వీని హృదయపుటభేదనం బొనర్చువార" మనియుదగ్రభంగి వాకొని చదల మిణుంగురు లెగయ నాగదలం గడుంగడిమి సారించి నాచెంతం జూపుల నిగిడించియున్న మన్నాథుపెన్నురంబు గుఱిచేసి యత్యుద్ధతిమీఱ మోదుడు నతండతిదీనాలాపంబుల వియత్తలంబు మాఱుమ్రోయ నెదనెత్తురులు జొత్తిల

దంభోళిధారాపాతంబునఁ గృత్తపక్షంబై యిలఁ బడు ధరాధరంబుఁ లేవఁ బుడమిం దూలి యశ్రుసిక్తంబులగు నేత్రాంచలంబుల నన్నుం గనుంగొని యిట్టు లనియె.

* చ. కలఁగఁగఁ జొచ్చె నామనము,
కాయము నొవ్వఁ దొడంగె, బాహువు
ల్బలిమిఁ దొఱంగి తూలెఁ, బటు
ప్రాణము లక్కట యోర్వ గాదె, న
న్నెలమిని గూడి వచ్చి యిటు
లీవనియందుఁ జరించునిన్ను వం
తలఁ బడఁద్రోచి యీల్గఁగ వి
ధాత విధించెను గాదె క్రూరతన్ ! 59

క. అనుప్రియుపల్కులు నాచెవు
లను ముల్కులగతిఁ జొరంగ * లాపజ్ఞి యటులా
డినపతిఁ గౌఁగిటఁ బొదువుచు
మన మెటియఁగ వారిఁ గనుల*మాఁర్కొని యంటిన్.

క. ఇదితగునే? పోకయ్యో
మది గరఁగదె? సోదరి నిటు * భ్రమందింపఁగ నా

నె? దయాపరతఁ గనుఁగొనరె?
యిదె మీపదములకు నర్థి * నెఱఁగెదఁ గనుఁడీ. 61

ఉ. దిక్కొక యింత లేక కడు
దీనగతిం బలుమాఱు నీవిధిన్
దిక్కులు సూచి సాయమును
దెంపును గాంచక పల్కు నాథుఁ జే
గుక్కునఁ జంపఁగాఁ దగునె
యుగ్గలినైనను నేఁచనౌనొకో?
మ్రొక్కెద నన్నలార ప్రియు
మున్నడి వీడరె నన్నుఁ గావరే. 62

మ. కరుణన్ బ్రోవరె నాదునాథు నితనిన్
గల్యాణముల్గల్గెడిన్;
దురితంబియ్యది చేయనేల యరులన్
దోశ్శక్తి శోభిల్లఁగన్
దురమందున్ దగ నోర్వఁగాఁ దలఁప కీ
దుష్కృత్యముం జేయనౌ
నె? రహిన్ జెల్లెలి నిట్టు లేఁచఁగను నౌ
నే మీకు యోచింపరే. 63

క. మ్రుక్కడిబలమిది మీకున్
దక్కిన నేమొకొ చెలియలి * తనువున నగ్గిన్
నెక్కొని దరికొల్పఁ దగదె
యుక్కివమున నిటుల లంత * నొప్పనె మీకున్ ?

తే. ఇట్టు లెంతయుఁ బలవించు * నట్టినన్ను
నగ్గిఁ గురియించుచూడ్కుల * నలిగి చూచి
వార లిట్లనిపల్కిరి * వనిత నీదు
తులువతనమునకు ఫలము * గలిగె నేఁడు. 65

ఉ. కాంచనగంధి కాంచనవి
కారములైనసముజ్జ్వలప్రభో
దంచితభూషణాళిరుచు
లద్భుతకాంతుల నీనఁ బ్రక్కలన్
సంచితవిక్రమాభ్యుదయ
శౌర్యనిధుల్ భటు లేపుమీఱఁగన్
మించునృపోత్తముల్ గవయ
మే లగు నీకును మాకుఁ జూడఁగన్. 66

తే. మమ్ముఁ గనుబ్రాము నిన్నట్లు * మచ్చుఁ జల్లి
వనికి నెలయించినట్టిఁడు * మనఁగరాదు

పోమ్ము మము వీడి యీతని * పొగరు మాన్చి
మఱియొకపనిఁ దలఁచువార * మఱక పోవె. 67

వ. అనిపలికి బాణబాణాసనంబులఁ గేల నందికొని. 68

క. కట్టెఁడులగు నాభ్రాతలు
కట్టలుక శిలీముఖతతిఁ * గారింపంగన్
దిట్టదనం బఱి నాథుఁడు
కట్టా పెనుమూర్ఛ నొందెఁ * గాలం బసదే? 69

క. దిక్కఱి పడునాథు నపుడు
చక్కడఁగఁ దలఁచి వారు * సరగున వింటన్
నెక్కలిపి ములుకు లేసిరి
మక్కువ నేవల దనంగ * మారకు లగుచున్. 70

క. నో రాడదు పై జరిగిన
గోరంబు నుడువఁ గటకట * గొబ్బున వారా
తీరునఁ దన పై బాణా
సారము నిగిడింప నతఁడు * శవగతిఁ దూలెన్! 71

తే. ఒడలు నెత్తుటఁ దోఁగఁ దా * నుస్సురనుచుఁ
గన్నుఁగవఁ గొంత తెఱచి నా * యున్న యెడకుఁ

జూపు నిగిడించి పల్కంగ * నోపక కకట
విడిచె నసువుల నాప్రాణ * విభుఁడు విభుఁడు! 72

తే. పంజరవిముక్తకీరదం * పతులకరణి
దోఁప శ్రీధామపురి వీడి * దొసఁగు గడచి
సుఖముఁ బడయంగ నెన్ని యా * శుభచరిత్రుఁ
గూడి వనిఁ జేరియు నతనిఁ * గోలుపోతి. 73

సీ. తమ్మితూండ్లను మెక్కి * తనరారు కోలఁకుల
దరి నిక్కి యంచలు * తనరుచోట,
జేగురునెరయించు * చిగురాకు సిరిమించి
మెసవి పాడెడుపిక * మెసఁగుచోటఁ,
జెలువారు క్రొమ్మావి * నలువారుచిల్కల
కలరుతం బలరారఁ * జెలఁగుచోట,
సుమబృందనిష్యంద * సుమధురమకరంద
మత్తాళిజాలంబు * మసలుచోట,
సినునికిరణంబు లోలయంగ * నెడము లిడక
నిక్కి క్రిక్కిఱియఁ బెరిఁగి * నింగి నొరయు
నవనిజాతంబు క్రీనీడ * నతనిఁ గూడి
లీల నానందవారిధిఁ * దేలుచుంటి. 74

* ఉ. చెందము కందళింపఁగను
డీకొని యాఁడుమ్మృగాళిఁ గాంచి యా
నందము మీఱ నొా చెలువ
నాదగు నేరుపుఁ గాంచు మంచు వా
నిం దన కేలఁ బట్టుకొని
నిక్కపుఁగూరిమి నాకు నిచ్చునా
మందర ధైర్య్య నాథు విడి
క్రమందెద నేఁ డిటు లల్పభాగ్యనై. 75

* తే. వలపు వెదచల్లుపూవుల * వలనఁ దొరఁగు
తేనెఁ గ్రోలుచు మత్తిల్లి * తివిరి క్రమోఁగు
తేంట్లయులివులు శ్రుతిగాఁగఁ * దెలిపి గనక
పాడి ముంచితి నానంద * వార్ధిఁ బతిని. 76

సీ. గగనంబుఁ జుంబించు * నగవాటిని వసించు
పులుగుగములకు మా * ఱులుఁగు లిడుచు,
నంచలంచల మించు * నంచలరవళికి
నానందపూరంబు * నందుకొనుచుఁ,
బురి విచ్చి సంతసం * బుల హెచ్చి వని మెచ్చి
యాఁడు కేకులసాబ * గమరఁ గనుచు,

మదనునిముల్కుల * పదను దీపింపఁగా
నలరునలరుల నే * పారఁ గొనుచుఁ,
గల్కిచిల్కలపల్కుల * కుల్కి వినుచుఁ,
దేంట్లరొదలకు మదిలోనఁ * దెప్పిఱిలుచు,
సరసుఁ బ్రియుఁ గూడి వనకేళి * సంతసిలుచు
మనినయాకాల మేరీతి * మఱతునొక్కొ. 77

తే. నామనోహరుఁ గినుకమై * నట్టడవిని
జంపితిమటంచు నానంద * జలధిఁ దేలి
యున్నవారు నాభ్రాతలు * నన్నతండు
పాయలేక యీపట్లనె * పరఁగువాఁడు. 78

తే. కన్నులఱమూసి నిదురింప * నెన్నునంత
నతఁడు తొంటిపగిదిఁ బ్రక్క * నలరువింటి
జోదుఁ బుసడించు తనరూపుఁ * జూపువాఁడు
నెఱియునాలింగనసుఖంబు * నెఱపువాఁడు. 79

సీ. పలలాస్థిగతమైన * బలుకాయమది పోయెఁ
గాని యాతనియాత్మ * గలదు చెంత,
నాతనిఁ బొరిమార్చ * నన్యులఁ బరిణయం
బౌదు నంచుఁ దలంచి * నామప్రాణ

ధన్యమైనజీవితే * శునిఁ జంపినట్టినా
భ్రాతలు గనరు నా * పట్టుదలను,
దేహసత్వము పోయెఁ, * దెంపు వాసెను నాకు,
నిఁక జమునిక్కడు * నేగవలయు,
జీవితాశయు రూపఱెఁ, * జెల్లదాకొ్క
యిందు నాజీవశేషంబు * నెలమిఁ గడచి
తుచ్ఛమానిట్టికాయంబుఁ * దొలఁచి ప్రియునిఁ
గూడి సంతోషజలధి నో * లాడఁ దలఁప? 80

శా. లీలన్ గాననభూజవారములఁ గే
లీసక్తతన్ జక్కవల్
త్రైలోక్యంబులసౌఖ్యముల్ తలఁపకే
రాగిల్లుచున్ గాంతలన్
వాలాయంబుగఁ గూడి సంతసములన్
బాల్గొంచుఁ దా మాత్మలోఁ
జాల సౌఖ్యముఁ గాంచఁ జూచి మది న
స్మన్నాథు ధ్యానించెదన్. 81

*క. అల్లన వీచెడుపయ్యర
కుల్లము రంజిల్లఁ దీఁగ * టుయ్యేలపై వి

ద్యుల్లతవలెఁ బ్రాలుపతియుఁ
జెల్లెను నే నిట్టి వగలఁ * జేడ్పడ నకటా. 82

ఉ. వానిమనోజ్ఞభాషణము
వానివినోదకథావిశేషముల్
వానిసుధీవిలాసగతి
వానిమనోహరసచ్చరిత్రముల్
వానిముఖేందుకాంతులును
వానివికాసపుఁగౌఁగిలింతలున్
నే నెటు కాంతు నింకఁ గరు
ణింపరె దేవతలార నాపయిన్. 83

సీ. ఎవ్వానినామంబు * నేవేళఁ బఠియించి
ముక్తి నొందెను శుక * మునికులేశుఁ,
డేవాని వేడ్కమై * నేవేళ ధరియించి
కడిఁదియశాయశ మొందె * ఖగవరేణ్యుఁ,
డెవ్వని ధ్యానించి * యేవేళఁ బ్రహ్లాదుఁ
డభయంబుఁ గనె మహా * హ్లాదుఁ డగుచు,
నెవనిసఖ్యముచేత * నేవేళ నరులను
నిర్జించి పేరొందె * నర్జునుండు,

నక్రబాధితగజము న * వక్రఫణితిఁ
బ్రోచె నెవ్వాఁడు, దయ నట్టి * భువనవినుతుఁ
డాసతావనరతుఁడు లో * కైకనాథుఁ
డొకఁడె నాచింతలను బాప * నోపు ననఁగ. 84

ఉ. వంచన ని ట్లనాథగను
వారలు న న్నొనరించి క్రూరులై
చంచలలోచనా మగుడఁ
జారుగృహాంగణసీమఁ జేరఁగన్
గొంచక రమ్ము; సత్కులజు
గొబ్బున నొక్కనిఁ దెచ్చి కూర్చి శ్రీ
మించఁగఁ బెండ్లి సేయుదుము
మే లగు నీకును మాకు నందుచేన్. 85

క. నీదగు నెలప్రాయము చెడి
పోదే యి ట్లడవి నెప్డుఁ * బొగులఁ దలంపన్ ?
వా దేటికి సతి రాఁగదె
మాదరి సుచరితఁ జరించి * మనుటయె యొప్పున్.

* చ. రతనముఁ గుందనంబునఁ గ
రం బుచితంబుగఁ గూర్చుభంగి నా

తతసుగుణాభిరాము శుభ
ధాముని రాజకుమారు నొక్కనిన్
బతి నొనరింప నెన్నుమము౯
బాయుచు నల్పుని వీని గూడి యీ
వితమున వచ్చుట ల్చనునె
విశ్వజనస్తుతకీర్తి యోఅంగనా. 87

సీ. శ్రీలునా౯ జెలువారు * చెవులందు మెఱపుల
చవి౯ జూపి కమ్మలు * చౌకళింప,
గగనంబు నిరసించు * కౌనున రాణించు
బంగారుమొలనూలు * ప్రభల౯ బెనుప,
సంపంగిమొగ్గకు * సరిపోలుముక్కున
వజ్రంపుముంగర * వన్నె లొలుక౯,
బూసరంబుల గెల్చి * పొలు పొందుకరముల౯
గనకకంకణములు * కాంతు లిడఁగ,
నీతనుద్యుతిచ్ఛటలచే * నాతతమగు
శోభ సమకూర్చి మనయింటి * సొబగు౯ బెంచి
మాకు౯ దుదిలేనిముదముల * నీక యిట్టు
లడవి నుండంగ౯ దగదమ్మ * నడచి రమ్మ. 88

ఆ. అతివ రమ్ము నీకు * నమలోరుగుణుఁడైన
వాని నరసి వైభ * వంబు లలరఁ
బరిణయంబు సేయఁ * బరఁగువారము వీని
నధమకులజుఁ గోర * నగునె నీకు ? 89

క. మనవంశము మాయదె నీ
వనయము వీని నిటుఁ గూడి * యతిమాధ్యమునన్
మనమునఁ దలఁపక నవ్వెడి
జనులను వసియించుచుండ * సరసిజనయనా ! 90

తోదకము. సరసిజలోచన * చయ్యన రావే
సిరులను వర్ధిలు * చెల్వుని నీకున్
సరియగువానిని * సాధుకులీనున్
బరిణయ మాదువు * వంత లిఁ కేలా ? 91

క. ఇదె వీఁడును గెడసెను మదిఁ
బదరఁగ వల దింటికి నిఁకఁ * బదవమ్మా, ర
మ్మెద సమ్మదము గడుంగడుఁ
గదురఁగ మనపురజనులకుఁ * గౌతుక మెసఁగన్.

వ. అని వచించిన నప్పలుకులు విన్నంత నా కవ్వన్నె
కాని తెగుదల స్మృతివిషయంబగుడుఁ జిందఱ

వందఱయ్యె కడుఁ బరితపించుచిత్తంబుఁ జిక్కఁబట్ట
నేరక. 93

క. తలపై మిన్నొరఁగినగతి
బల ముడిగి పడితి నిలపయి; * బాలిశు లన్నల్
చలమున ననుఁ దేర్చి నిలిపి
పలికిరి కోపంబు వీడి * పనవెడినాతోఁ. 94

ఉ నిక్కపుబుద్ధి గల్గి కడు
నేరుపు గల్గినదాన వంచు నీ
చక్కని మేనిఁ బోలుమతి
సారము గల్గినదాన వంచు నే
మక్కట యెప్పుడున్ దలఁచి
హారిగుణాళివిలోలుఁడై వరున్
జక్కనివానిఁ గూర్పమదిఁ
జాలఁ దలంచెడివార మంగనా. 95

తే. అట్టిమ మ్మిట్లు వంచించి * నట్టివీని
మట్టువెట్టితి మలుకయు * మానె నబల;
మమ్ము నూరక దూఱక * రమ్ము నేఁడు
పురికిఁ జని యందు సుఖ మందఁ * బోలు నీకు. 96

## హయగతి రగడ.

అన్నలు. ముగుద రమ్ము * ముదము మీఱఁ
దగవు లరయఁ * దగదె నీకుఁ?

నేను. జాలుఁ జాలు * సరణి దెలియ
కేల పలుక * నిట్టు లిపుడు?

అన్నలు. ఇంతి కోప * మింత యేల?
వంత నిట్లు * పదర వలదు.

నేను. అన్నలార * యగునె యిట్లు
వన్నెకానిఁ * బట్టి చంప?

అన్నలు. చాన వీఁడు * చావఁ దగును
బూని నిన్నుఁ * బొదివి తెచ్చె.

నేను. అకట నేనె * యతనిఁ గూడి
వెకలులార * వెన్బడితిని.

అన్నలు. ఏల నీకు * నేడ్వ నింక
బాల వీఁడు * బ్రతుకువాఁడె?

నేను. మాసె నకట * మనకులంబు!
పాసె విమల * భవ్యయశము!

అన్నలు. బాగుబాగు * పలువఁ జంప
నేగనొక్కొ * యెల్లయసము ?

నేను. చెల్లె నిటులు * చెల్వఁ బాసి
యుల్లమందు * నుడుకఁ జేసి
పొంగువారి * పొందువలదు ;
నింగి నొరయ * నిక్క వలదు ;
పొండు పొండు * పొగరు వలదు ;
మండుకినుక * మాఁడ వలదు ;

అన్నలు. ప్రల్లదనులు * పలుక నేల ?
యిల్లుఁ జేర * నింక రమ్ము. 97

తే. నీదుమాటల జవదాట * నేర మింతి
నీవ రాణివై యేలుము * నెమ్మిఁ బురిని ;
ఏము నీపనిచినవాని * నెల్ల సేసి
సమ్మద మ్మొనఁగూర్తు మో * యమ్మ నీకు. 98

* సీ. లలితహర్మ్యస్థలి * నలరారుమృదుపాద
యుగళంబు వనిలోనఁ * బొగుల నేల ?
వీణానినాదంబు * వినువీను లీఘోర
మృగరావముల కుల్కి * సొగియ నేల ?

ఆళీజనాళితో * నానందమున నాడు
తనువల్లి కానలోఁ * దలఁకి నేల?
సంతతమోదాబ్ధి * సరవి నోలాడెడు
స్వాంతంబు చింతల * సడల నేల?
కొమ్మ మా వెనువెంట రా * వమ్మ నీదు
నెమ్మనమ్మున కిమ్మైన * యెమ్మెకాని
సమ్మదమ్మునఁ బెండ్లాడి * నెమ్మిఁ గనుము;
యిమ్మహావిపినమ్ము గో * రమ్ము రమ్ము. 99

వ. అనునాయగ్రజన్ములపలుకులు కాననదారుసంఘంబుల నికషంబునం బొడమి దరికొని మిన్నొరయఁ బ్రజ్వలించునర్చిష్మంతునకు వాతహతులవలెఁ జింతాతప్తంబగు నాచిత్తంబునకుఁ బరిణమింపం గెరలి యత్తోఁబుట్టుల విలోకించి నే నిట్లంటి. 100

ఉత్సాహ. అన్నలార! యిట్టు లాడ
నౌనె మీకు? నీగతిన్
నన్ను నాథఁగాఁగఁ జేసి
నయము వీడి యింటికిన్

జన్నె నన్నుఁ బిలువ? నకట
సర్వ మితనియందె నే
మున్న యుడినమదియు నెట్లు
మొనయు నితరుఁ జేరఁగన్? 101

శా. ఏమీ మీాబలునీసు నేమనుదు ! నిం
దీనామనోనాథు సం
గ్రామక్షోణితలంబునన్ గరినతన్
గాంతాళము౦ బూనుచున్
భీమంబౌ గతి వంచన న్గడపియున్
బేల్పోయి దుఃఖాబ్ధి ను
ద్దామస్థైర్యమునం దరింపఁ గనునన్
దాఁకింపఁగాఁ జెల్లునే? 102

* తే. ఆరయ బలారిపాలిత * మగుచు నెగడు
నట్టి యలకాపురమె యైన * నందుఁ జొరను;
ముగుద యబలారిపాలిత * మగుచు నెగడు
నట్టి యలకాపురం బెట్టు * లకట చొచ్చు? 103

క. వీరాపురి మీారే యేలుఁడు;
కాపుర మది మీాకుఁ దగును; * గౌరవధన్యం

డాపురి నేలినజనకుఁడు

నాపాపవశంబునఁ జనె * నయ మిప్పు డఱఁగా.104

తే. అతఁడు గల్గిన మీ రిట్టు * లడరువారె?

ఇట్టిమీదౌష్ట్య మొప్పునె! * పట్టి మిమ్ము

మట్టుపెట్టింపఁ దొడఁగఁడె? * మహితగుణుఁడ

తండు లేనియాపురమది * మండనిండు. 105

ఆ. అతఁడు చచ్చునపుడె * యాపురి వైధవ్య

దశను దాల్చె; నపుడె * ధరణిసురుఁ డొ

కండు దెలిపె నింకఁ * గడుభీమమైనట్టి

చెడుగు లుప్పతిల్లఁ * దొడరు ననుచు. 106

ఆ. ఇదియె మొదలు; మీకు * నింకఁ గొన్నాళ్లకు

వైరివరులతోడి * పోరు గలుగు

నట్టియాహవంబు * నందు మీ రోడి యా

శత్రువరులచేతఁ * జచ్చువారు. 107

క. ఇది తప్పదు; కావున నెదఁ

బదరక పురిఁ జేరి బంధు * వర్గంబులతోఁ

గదియుచు బిడ్డల నాంధ్రను

సదయతఁ గన్గొనుఁడి యిపుడె*సంతసమారఁగా.108

క. నన్నిటుచేసిన యీశ్లోల
చన్నే ? యూరక యడలఁగఁ * జక్కటియూనే ?
మన్నాథునిఁ జక్కడిరి
రెన్నఁగ నదియుఱక చనునె * యేలా వెఱవఁగా.109

క. చెల్లె ననాథఁగఁ జేసిన
సల్లలితయశం బలర న్ప * శంసత మెఱయన్
మల్లుపెనంగునరులచే
మల్లడిగొని కాలుఁ జేరి * మాయుఁడు వేగన్.110

వ. అనునాపరుషవచనంబుల నాతోఁబుట్టు లాలించి యక్కాలజ్ఞునిపలుకులు నిక్కంబు లగునో కో యని చింతించి మించు నెంజెలిఁ బరితపించుతమచిత్తంబులఁ జిక్కఁబట్టనేరక తలలు వాంచి లోచనాంచలంబులఁ గన్నీరు నించి తమచేసిన కార్యంబును మరల్పరామి నెఱింగి నాదగు మనోదార్ఢ్యంబుఁ దలపోసి యత్యుష్ణనిశ్శ్వాసపరంపరలచేత వీతవికాసంబులగు నిజవదనసరసిజంబుల ముడుచుకొనుచుఁ గ్రీఁగంట నన్నుం గనుంగొని "తల్లీ! యొడలెఱుంగక నీకిడుమలిడ నొడికట్టిన మాకట్టిఁడితనంబు సైఁపవే? వీనిం దెగటార్ప నిం

దుండి తెరలి పురిఁ జేరి యొండొకనిఁ బెండ్లియై సుఖం బుండఁ దలఁతు వైకోౕయని కఠినులమై యీకార్యం బునకుం బాలుపడితిమి. నీకు వీనియందుం గల్గు నిక్కం పుమక్కువ తెలియఁగలుగరామి నింతయుం బాటిల్లె. ఇట్టి దుర్ఘటమైన పాపంబునకుఁ బాల్పడిన మే మిఁక నీమోముచందముఁ జూడనోపము. ఇఁక నిన్ను మాపురికి రమ్మని నీచింతాక్రాంతంబగు చిత్తంబుఁ గారింప వెఱతుము. మఱియు విలయకృతాంతాతిభయదకోపాటోపంబునకు నెదదిగు లొందము. ఉన్నయొక్క చెల్లెలి నిట్లపారదుఃఖాంబుధి ముంచిన మే మెట్టిపోఁకఁ బోయి నఁ మాకు సమ్మతంబ. అప్పుడమివే ల్పన్నట్టు పరిపంథివాహిను లాశ్రీధామపురంబుఁ గవియనిమ్ము. రణరంగం బునం గడతేరు మా నెత్తురుల నీప్రియునికిం దర్పణంబు నెఱపి తుచ్ఛోచ్ఛ్వాసముదయమలినంబులగు నికాయంబులఁ దొలంచి పావనుల మయ్యెదము. ఇందున కేల వెఱవ? మాయొనర్చిన కొఱగానిపనులకుం గడుఁ గుందు మా కరివరులచేతిమరణంబు సకలదురితవిచ్ఛేదకంబు గాదే? కానిమ్ము. వచ్చునది రానిమ్ము. మృత్యు

దేవతాసందర్శనంబున కెమరు చూచుచున్నారము. పోయివచ్చెద మమ్మ. మమ్ము మన్నింపుమా యని వేడఁ జాల మమ్మా..... అయ్యో! నిన్నిక్కా అడవి నొంటి డించి పోఁ గా ళ్లాడకున్న వే! ఇన నీ మనోనాథప్రాణాప హారులమగు మాయునికి నీనెమ్మనం బెరియింప కున్నె? ఇదె పోయెదము. అదె కాలునినికాయంబు కన్ను లకుఁ బొడకట్టుచున్నది. మాకై నీ వడలవల దమ్మా. మాచేతలనె మేము పొలియువార మమ్మా",యనిపల్కి పెద్దపెట్టున వాపోవుచు నన్ను వదలి కాంతారంబు నిర్గమించి పురిని జేరిరి. 111

క. అయ్యో దుఃఖము దరికొనె
నయ్యా; యీతనువు వీడ * నగు విధి నెఱుఁగన్;
గయ్యంబున మగఁ డీల్గెను
దయ్యము నను నిలిపె నకట * తల్లడపడఁగన్! 112

* సీ. విరహిణీజనములు * వీతాసువులు గాఁగ
వలపులఁ బెర రేఁచి * పవనుఁ డొలయఁ,
గందర్పశరవిద్ధ * కాంతాళి తపియింప
వెన్నెల లొలయించి * విధుఁడు రేఁగ,

నంగజానలకీల * లలమంగ నలసిన

ముకురాస్య లడలంగఁ * బకము లడరఁ,

పతివియోగజనిత * బాధల సైఁపని

తెఱవలు కుంద గఁ * దేంట్లు గ్రమ్మఁ,

గుసుమవిసరంబులవి చుఱు * కుక్కనను దనుపుఁ

గాఁడఁగ, లతాంతమంజరీ * గళితమధుర

సంబు నెమ్మేనిపైఁ జింద * సడల కెట్లు

నిలుచుఁ బతిఁ బాసి పొగిలెడు * నెలఁత చెప్పుమ.

* ఉ. ఒక్కొకనాఁడు నన్ను విడి

యొక్కఁడ కానకు నేగి డాఁగు; నే

నెక్కొనుభీతిచేఁ గలఁగి

నిక్కువ మెన్నఁగ లేక నల్గడల్

పొక్కుచుఁ గాంచ నావెనుకఁ

బొంచుచు నల్లన వచ్చి నాకనుల్

గ్రక్కున మూయునాథు నెటు

కాంతు నిఁ కెట్టులు తాల్తుఁ బ్రాణముల్. 114

వ. వెండియు నొక్కకిరాతుం డొక్కనాఁడు నాకుఁ దెలి

పిన దే మనిన. 115

తే. అట్టు లానాఁడు నాయన్న * లడవిఁ గడచి
వీడు సేరంగఁ జనునంత * వీరవర్యు
లైన యరిరాజు లాపురి * నాక్రమించి
యడరఁ గాంచి పోరున కట్టె * కడఁగిరంట. 116

వ. మఱియు నక్కాయ్యం బతిఘోరంబగుటయు నాశత్రు యోధుల సైన్యం బసంఖ్య రథగజతురగపదాతిసంపన్నం బగుటయు నాసహజన్ములకు యుద్ధసన్నాహంబునకుఁ దెలిపిలేమిచేతను మావారిబలంబులు క్షీణింపఁ దొడంగుటం జేసి. 117

తే. అల్లయెలుకు తెలిపెను వా * రెల్లఁ జత్తు
రనుచు; నా ప్రాణధనమైన * యనుఁగు మగఁడు
నేగె; నక్కట నలువ తా * నెంత కఠినుఁ
డయ్యె నన్నిట్లు వాపోవు * మనిమె నిలిపి! 118

వ. మదీయక్రూరసహోదరప్రయుక్తాతి నిశితాయుధ పరంపరాహతింజేసి మన్నాథతనుస్రవదరుణక్షతజ ధారాపంకిలంబగు నియ్యిలాతలంబున జననంబునొం దిన యీాలతామతల్లిక మదశ్రుపూరపరిషేచనంబునం

బెరిఁగి మత్ప్రాణనాథబంధు రానురాగసూచకంబుగ
నిక్కుసుమంబు ననుదినంబు నాకర్పించుచుండు. 119

* చ. పరిమళము ల్దిగంతములఁ
బర్వెడు పువ్వులతేనె మెక్కి, నా
పురుషుఁడు చెంత నిల్చునల
పొల్పున కుల్లమునందు నిక్కి, కా
తరహరిణంబులన్ గనఁగఁ
దద్దయు వేడ్కల సొక్కి యాడునా
కరిగొని ధాత మోదముల
నంతయు నొక్కట పాపెఁ గ్రూరతన్. 120

* తే. సొబగు లేమావిపూ దేనె * సోనఁ జిల్కు
గొనబు పొదరింటఁ జిగురుపా * న్పున వసించి
మోడిఁ బతితోడ సరసంబు * లాడినట్టి
నాకు నొడగూర్చె నీవంత * నలువ యకట ! 121

* సీ. తీరైనమల్లికా * కోరకంబులఁ గాంచి
చెల్వునిరదనాళి * చెలువుఁ దలఁచి,
సరసంపురుచిమీఱు * సరసిజంబులఁ గాంచి
చెల్వునినెమ్మోము * చెలువుఁ దలఁచి,

వలపుల వెదచల్లు * కలువలనెట్టిఁ గాంచి
చెల్వునియక్షుల * చెలువుఁ దలఁచి,
సిరిమించుసంపెఁగ * విరులహాసును గాంచి
చెల్వునినాసిక * చెలువుఁ దలఁచి,
కుసుమకోమలాంగుని నాథు * నేసక మెసఁగు
చింత పొదలంగఁ బొగిలెడు * చిత్తమందు
నెన్ని యీవిరాళిని గుంద * నెట్లు సైఁతు!
నెట్టు లీదుఃఖపాథోధి * నీఁదుదాన! 122

* ఉ. వెన్నెలఱేఁడు కాననము
వెల్లగఁ జేయుచు నాకసంబునన్
జెన్నలరారఁగాఁ బతినిఁ
జేరి వనాంతర సీమలన్ మనం
బెన్నఁగరాని మోదముల
నెంతయుఁ దేలఁగ నిందు నందు వే
డ్కన్ నడయాడుదాన నిదె
కాంతునిఁ బాసి విరాళిఁ గుందెదన్! 123

తే. నాఁడు కౌరవసభయందు * నయము వీడి
ద్రౌపదీసతి వలువలఁ * బాపజాతి

దుస్ససేనుఁ డొలువఁ గాంచి * తుఱఁగలించు
చీర లిడి సాధ్విఁ బ్రోచిన * శౌరిఁ దలఁతు. 124

సుగంధి. నన్నుఁ బ్రోవ వేల శ్రీశ
నందగోపనందనా?
యన్న లెల్ల నిక్కి నాదు
ప్రాణనాథుఁ జంపి యా
పన్నఁ జేసి రయ్య నన్ను,
భవ్యకీర్తిఁ గాంతునిఁ
సన్నుతాంగుఁ బాసి క్రుందు
చాన నన్నుఁ జూడవే. 125

* సీ. మలయాగమునఁ బుట్టి * మారునిఁ జేపట్టి
పరిమళంబుల దొట్టి * పఱచుగాలి,
కానందమున నిక్కి * యాసవంబుల మెక్కి
పూవులపయి నెక్కి * పొదలునళికి,
సరసులదరిఁ జేరి * కరము బారులు దీరి
నీరు ద్రావుచు మీఱి * నిగుడు లేళ్ల,
కందమానడఁ గాంచి * యల్లన నడ తెంచి
మోల వేడ్కల మించి * మురియునంచ,

కెడఁద నలరుకాల * మెడలంగ నీరీతి
సంతసంబు లెల్ల * జాఱి నయ్యె
నకట ధాత చింత * నడలుమా యని యిట్టు
లదయుఁ డయి విధించె * నలమె వగలు! 126

తే. ఈభువి నిఁక వసింపఁగ * నిచ్చ లేదు
మున్నె జీవితేశుఁడు చని * యున్న యట్టి
యెడను ననుఁ జేర్చి నా ౯మొక్కు * లెల్లఁ గొనుము
పార్థసారథి కారుణ్య * భవ్యశరధి. 127

* సీ. వల్లీమతల్లజం * బల్ల నల్లన నెక్కి
యుయ్యేల లూఁగిన * యురవు గడచె!
సురభిళామోదసం * భరితాటవికపుష్ప
వారము లలచోట్ల * వలపు చెల్లె!
శుకపికంబులతోడ * సొంపొంద గానంబు
సలిపెడు నేరుపు * సడలి యడఁగెఁ!
గడుకూర్మి నడుకాన * నడయాడి మోదంబుఁ
జెందెడుబుద్ధియుఁ * గంది పోగిలెఁ!
బూలపొదరింట డాఁగెడు * పొలుపు వీడె!
నలరులను జిమ్ముబలు వేడ్క * లలఁతు లయ్యెఁ!

బతియు నను వీడి నాకంబు * బడిసినంత
కట్ట యేరీతిఁ గాలంబుఁ * గడపుదాన! 128

క. తనయాశ్రితు బీభత్సుని
ననయంబును బ్రోవఁదలఁచి * యతనికి సఖుఁడై
వినయమున సారథియగుచు
నని జయమొందించిన హరి * నర్థిఁదలంతుౘ. 129

* సీ. ఏదేవుపదయుగ్మ * మేవేళ ధ్యానించి
విజయుఁ డయ్యెను యల్ల * భిమరపాణి,
ఏనాథుఁ దలపోసి * యేవేళఁ దాయుధి
స్థిరుఁ డయ్యెనో పాండు * వరసుతుండు,
ఏవీరుఁ గొలుచుచు * నేవేళ నరులకు
బీభత్సుఁ డయ్యెనో * శ్వేతవాహుఁ,
డేధీరుఁ గీర్తించి * యేవేళఁ జతురాస్యుఁ
డయ్యెనో నలువ తా * ననువు మీఱ,
నీరమణుఁ దాల్చి శేషాహి * భూరిమహిమ
నలయనంతాఖ్య నార్జించె * నట్టిమాని
వంద్యు నాశ్రితరక్షకు * భవ్యుఁ గొలుతు
భక్తజనకల్పభూజు నా * వరదరాజు. 130

మత్తకోకిల. లోకరక్షక మానిచిత్తవి
లోల దేవ సురావనా
నాకు నీభువి దిక్కు లే; దీఁక
నన్నుఁ బ్రోవవె శ్రీపతీ;
నీకు మ్రొక్కెద నాథుఁ జేర్పవె
నేడు నాదగుప్రాణముల్
వీఁకఁ బాపుచుఁ; గాంతురూపును
వేడ్కమైఁ గనఁ జేయవే. 131

* * * * * * * *

మ. అకటా యిట్లని పల్కుచున్ బనవున
య్యబ్జాతపత్రాక్షికిన్
వికలంబౌ మది వంత వెల్లివిరియన్
వేగించుతాపాగ్ని యా
సకియం దార్కొని యేర్పఁగా నసువులన్
జంద్రాస్య తా వీడి నా
యకు నైక్యంబును గాంచె దక్షజ శివై
క్యం బొందుచందంబునన్. 132

లలిత విద్యావినోదియై * చెలువుమీఱు
   శ్రీపనప్పాకవంశాబ్ధి * శీతకిరణుఁ
డౌ ననంతార్యవర్యు శ్రీ * యాత్మజుండు
   శ్రీనివాసుండు రచియించె * దీని నిట్లు. 13



THE VAIJAYANTI PRESS, MOUNT ROAD, MADRAS.

## మాలిని.

సరసిజదళనేత్రా * శాంకరీభర్తృమిత్రా
వరజలధరదేహా * భవ్యపక్షీంద్రవాహా
సురమునిజనరక్షా * శుద్ధకారుణ్యపక్షా
పరమపదనివాసా * వల్లవీహృద్విలాసా 133

ఈసతీమణిచరితంబు * నేను నీదు
కరుణచే రచియింపంగఁ * గల్గినాఁడ;
నీశిశువుకృతిఁ గైకొను * మిందిరేశ;
చెలిమిఁ గన బుధులను బురి * గొలుపుమయ్య. 134

తనభోగవైభవం * బున కెంతయును మెచ్చు
నాయనంతునితల * లల్లలాడఁ,
దనవాగ్విలసనంబుఁ * దాఁ దాల్చినయనంతి
పదమది పలుమాఱు * వదరి మ్రోయఁ,
దనతాలిమికి ననం * తాదేవి కడునోడి
యచలయై వెలుఁగున * నట్టె నిలువఁ,
దనయాత్రికతావన * మును గాంచి నెమ్మదిఁ
గడలి ననంతుఁడు * గన్ను మోడ్పఁ,